2 శోకతప్తుడను నిన్ను వలచెను - పాకమెరిగిన భక్తజనులను - సాకగల సర్వాత్ముడవు నీసదనమే సకలార్థమయమహా ॥నీకు॥

3 సాధుజన పోషకుడవనియంటి - సజ్జనులవంటి మోదమున విహరింతువనియంటి - బాధలన్నియు బాయుటకు నీ పాద సేవయే భాగ్యమని పెడవాదములకు బోపకను నిను వాంఛతో భజియింతుతండ్రి ॥నీకు॥

4 ఆర్తులను దయజూచుమహనీయా - ఆనందనిలయా దూర్తుడను నను బ్రోవరావయ్యా - కీర్తిగల సర్వోత్తమా నీ కీర్తనంబే శ్రేయమని సద్వర్తనులు దెలుపంగనీవే భర్తవని భజియింతునహరహము ॥నీకు॥

5 దంతివరదుడవనుచు నినుగొలచీ - ధర్మములనెంచీ శాంతులై సజ్జనులు నినుదలచీ - వింతవింతలు వీడినీకథలంత రంగమునందునిడి యేకాంతులై సుజనాళిగూడుచు చింతలెల్లను వీడి వెలయరె ॥నీకు॥

6 ధరను దరియా బహుశ్రేష్ఠాకృపగలిగి - దరిజేరి మెలగీ దురితములుగని దూరమునదొలగీ - పరమపద మార్గమున కిదియే తెరవటంచును తెలిసిభూశీం మరువకను నీభజన జేయుటె మంచిదని మదినెంచగలిగెను ॥నీకు॥

6 క్షితిని ఖుందురు వారిపురమునను-గతిదెల్పుదరియా- ఘనుని
కరుణ బడయగోరిన- వెతలు లేవటంచు ఖాశీం మతినినమ్మి
యాత్మతత్వ హితవుగలిగి వేదవేద్యు వెదకి తెలియు విమల
మదియో ॥ఎంత॥

## 39 తత్వము

(భూపాళ రాగము - ఆదితాళము)

1 లుచ్చా నీకెంత జెప్పినను తుచ్ఛపుపనులవి మానవు ఛీ ఛీ
॥లుచ్చా॥

2 హెచ్చుక బోవుచు గచ్చులుబలికెవు - ముచ్చటలవియని
మురయుచు నెవ్వడు-విచ్చలవిడిగా విర్రవీగినను- వచ్చును
అపద వదలదునినుగని ॥లుచ్చా॥

3 కొంటెలార్గురను కూడిన బహువిధ-తంటలుగలుగును దారి
దెలియదెటు-మంటికిబోయెదు తనువునుజూచిన- వెంటరాదు
నీవంటరివౌదువు ॥లుచ్చా॥

4 భోగభాగ్యములు సతమనినమ్మకు - రాగాదులనిటు రానీ
యకుమీ - త్యాగివౌచు నీయోగసిద్ధికై - ఆగమవేద్యుని
యంటితిరుగు నీకే ॥లచ్చా॥

5 తప్పుదుపనులవి గొప్పగావు - నీవెప్పుడుదలచకు ముప్పు
గలుగు-(శ్రీ)హావ్రతిపదములు నరయుచుదిరిగిన - తిప్పలు
లేవి చొప్పుదెలియుమీ ॥లుచ్చా॥

6 కన్నుగానకను దున్నపోతువలె - మిన్నుమన్ను రెండెను
గకదిరిగిన-మున్ననలేదిది మర్యాదౌనా - అన్నిటిజూడదె
అమహాదేవుడు ॥లుచ్చా॥

7 వాసిగ దరియా గురువరుసేవయె- గాసిదీర్చునని దెలిసియు
ఖాశీం-మోసపోయినను వేసటగాదా - దోసిల్యొగ్గి పర
దాసునిగనవే ॥లుచ్చా॥

## 40. తత్వము

(భూపాళరాగము - మిశ్రగతి)

1 పోదాముపదవే జీవా మనము పోదామువదవే-పోదాము
పదవె యా భువనాకారునిజూడ-వాదాభేదములేని బోధా
గలుగును మనకు ॥పోదా॥

2 ఆదిఅంత్యములేని వేదవేద్యుడుమనలో- పాదుగ నివసించి
ప్రభలుచునున్నాడు ॥పోదా॥

3 యెన్నెన్నో విధములై యున్న మాయనుగూడి - తిన్నగ
నాడింప ధీరుడై యున్నాడు ॥పోదా॥

4 భిన్న భిన్నములైన వన్నెలకును మిగిలి - యున్నాడఖి
లాత్ముడై యోగీశ్వరులబ్రోవ ॥పోదా॥

5 సృష్టికాధారమై నష్టమెన్నడుగాక - శ్రేష్టత్వమున తాను
ద్రష్టయై యున్నాడు ॥పోదా॥

6 దంషిప్రభువై మనకు దారిజూపుచు యూర్ధ్వ - కుండలికెని
నెళవై పండియున్నాడిట్లు ॥పోదా॥

7 నీవారశూకమున నిలచి నిర్మలుడౌచు - భావాముఖసింధి పరశివుడై యున్నాడు ॥పోదా॥

8 నాశికాగ్రమునందు దేశికమూర్తియై - భాసిల్లుమనుపర నివాసియైయున్నాడు ॥పోదా॥

9 ధరలో దరియాకుసుడై పరమాత్ముడై ఖాశీం-తెలియించు టకు మంచి తెరవుదెల్పెను నేను ॥పోదా॥

## 41 తత్వము

(నాదనామక్రియ - ఖండగతి)

1 సర్వేశ్వరా నీదు చరణసేవకుడనను శరణంటిరక్షింపరావా- నుర్విలో నినుదలచు యోగ్యతను దయజేసి నిర్వాణునిగ జేయలేవా ॥సర్వే॥

2 యతులితంబైన యానందపద మొసగి యాదరించుటకిటుల రావా - సతిమైన నీవె నాగతియనుచు నమ్మితిని - హిత వాక్యములు దెలుప రావా ॥సర్వే॥

3 నీవెదిక్కని నిన్ను భావంబునను గొలువ పావనునినను జేయ గావా - అవనిలో నీకంటె అధికులు లేరనియు యాసించు నను గావలేవా॥సర్వే॥

4 ధీసాక్షి నీవనుచు లోజూచువారలకు - వేసటలు బాపగా రావా - వాసనత్రయములకు వశపడని నిను వేడు దాసులను కరుణింప లేవా ॥సర్వే॥

5 అరలేక భక్తాళి మొరలిడిన దరిజేర్చు - పెరుదుగలిగిన తండ్రిగావా - ధరణిలో బహు రూపధారుడవనగల నీవు పరమార్ధ మొసగగా లేవా ॥సర్వేశ్వరా॥

6 వాసిగా దరియా హుస్సేన్ షా గురురూపమై భాసిల్లు పరమాత్మ రావా - నీశమము తేరవియు ఆసించు భాగ్యము దాసు మొర యాలింపలేవా ॥సర్వేశ్వరా॥

## 42. తత్త్వము

(మిశ్రగతి - కాంభోజి రాగము)

1 గురుదేవా నీ వెయాధరను సుజనుల బ్రోవ-కరుణాన్వితుడ వైతివి - నిను గొనియాడ దురితములను దుంచితివి - పారమార్థికమైన తెర పెరుకవరచి సుసిద్ధుల జేయుగ నీవె-వరదుడవు వైకుంఠవాసివి వాంఛలెల్లను దీర్చు ప్రియుడవు-మమునకను విన్నపుము గొలచెదు మార్గమున నిలుపవె దయతో ॥గురు॥

2 అంతు యెుదనరాని బంధరహితుడవై నీ - వుందువని విందురవని పరిశుద్ధాత్మ అందూ నివసింతూవని-వినదూగ నీ కథలందిన ఋషులెల్లానందముతో నితర మొందుజూడక నిన్నె - డెందమున నిలిపియు ధనములనండబోరవి నీదు కృపకే - ముందుగా నీ పదములకు నే వందనంబొనరింతు ననిరెపుడు ॥గురు॥

3 కోరిదృఢవ్రతులై నిను జేరి భజియించిన-భారము నీదెకదా శుభములగూర్చ దూరము లేవుగదా - కారణాచార్య నీ

ఘనమెవ్వరెరిగిరో వారలై నినుగాంచి ధీనులై మెలగెదరు-
పోరిమాయతో మీరి సర్వాధారమౌనీస్మరణ విశ్వాకారమై
వెలుగొందు నినుగనుదారియనిదెలిపెదరు భువిలో ॥గురు॥

4 వాసరార్చితుడవై భాసిల్లుపరలోక-వాసివని బొగడొందిన
నీవే ధరలో దాసూల దరిజేర్చినా - యీశుడవో దరియా
దేశికమూర్తి నీదాసుడనౌ ఖాళీందాసు నను కడతేర్చ -
దోసిలొగ్గి స్తుతింతు నరమోల్లాస పరశివ భక్తవరదా-
యాసజెందితినీకటాక్షముగాసిదీర్చనటంచుమదిలో ॥గురు॥

## 43. తత్వము

(ఏక తాళము - నాదనామక్రియ)

1 అన్ని దేహములలో వెలసి నిండిన యాత్మ నెరుగవలెను -
భిన్నమైనమార్గములను బోయిన భేదదృష్టియౌను ॥అన్ని॥
2 ద్రష్టనుజేరిన వారలెభువిలో ధన్యులమనవలెనూ - దృష్టి
విధానం బెరుగనివారలు సుఖము జెందరిలను ॥అన్ని॥
3 గాత్రము లోపల సూత్రధారునితో కలసిమెలగవలెను -
నేత్రములో నిజరూపంబరసిన నిశ్చలత్వమౌనూ ॥అన్ని॥
4 పోయిగల్గు నదుపాయము నెప్పుడు బాయకుండవలెను -
మాయామయమౌ జగమున జేరని మార్గమెరుగవలెను
॥అన్ని॥
5 భక్తిని సర్వప్రపంచముకల్పిన రక్షకుగనవలెను- మోక్ష
శక్తి జనించినవారలె దీక్షయౌను ధరను ॥అన్ని॥
6 దరియూగుకువదు కారణస్మరణమె వప్పని వనియౌను -
మరువక ఖాళీం తెరవులేని యాదరణంబికగల్గు ॥అన్ని॥

## 44. తత్త్వము

(నాదనామక్రియ - మిశ్రగతి)

1 గురుదేవ నీపాదస్మరణజేసెదనన్ను - కరుణించుమని వేడితి -
పరమపదవాసుడవు నీవని భావమున నినునిల్పియుంటిని -
మరువకను నీమరుగుజేరెద తెరవుజూపవె పరమపురుషా
॥గురుదేవ॥

2 ఎంతవేడినా యిసుమంతైన దయరాదు - పంతమా నామీ
దను - చింతలెల్లను దీర్తువని నీచెంత జేరిన నాథ - నీకృప
సంతసంబొనరించి గావవె వంతుకెక్కిన వైభవుడవో
॥గురుదే॥

3 ఆపదోద్ధారకా యానందనిలయా - నీప్రాపుగోరిన వాడనూ -
కోపమెంచక బీదనను నీ దాపుజేర్చి యఘంబులెల్లను -
బాపుమో భవబంధరహితా భావగోచర భక్తపోషణా
॥గురుదేవ॥

4 అంటజేరినవారి దుండగములు దుర్మించ - దండిమూర్తివి
నీవెగా - పండితులు నీభజనజేయుచునుండి నిత్యానంద
మునను - యఖండమై వెలుగొందు నినుగనుచుండి బంధ
విముక్తులైరట ॥గురుదేవ॥

5 ఎల్లలోకములలో గొల్లగ వెలిగె నీచల్లనిదయజూపవే -
తల్లిదండ్రియు దాతదైవము ఎల్లనీవేననుచు నెల్లపుడెల్ల
మున గొనియాడి యితరము నొల్లనను కడతేర్చగదవే
॥గురుదేవ॥

6 వాసిగా దరియా గురుదేశికువచనము లు - ఆసించి నుతియింతును - మోసమేమియులేని పరమోల్లాస మొనగూర్చియును ఖాశీం దాసునీ క్లేశములణచి పరమునివాసమున నిలుపంగగలశ్రీ ॥గురుదేవ॥

## 45. తత్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 అంతరాత్మను దెలియావె ఓమనసా భవమంత మొందును గానవె - సంతోషమున పరమశాంతునిరధలు నీస్వాంత మందుననిలుప- చింతలేమియు లేవు - వింతవింతలు గలుగు మాయను-చెంతజేర్చక యుంటివా సుఖ మింతయని దెలుపంగరా దహానుంత వదలు నిరంతరమునీ ॥అంత॥

2 సందేహములు వీడియు నీలోనీకానందముగలుగు మరియు - బంధమేమియు లేనిసంగదియు దే మును వేల్పులందారు తమలో తామందినవిధమిది - మందమతులకు తెలియకను యిహ పొందుగోరిరి ముందుగావక డెందమున నినునీవె గాంచిన అందమై యఖిలంబు నవుదువు ॥అంత॥

3 అంటిఅంటనిదైవము నీలోగలుగ జంటవిడి జనబోకుము - రెంటికావలను ముక్కంటిపదములుముట్టి వంటుదెలిసిన నీకే తంటాలేమియులేవు మంటిపాలై పోవు దేహము- వెంట రాదెప్పటికి వినుమా- బంటుతనములు వదలి పరశివునంటి మరువకనుంటె జయమా ॥అంత॥

4 మించిపోయెను కాలము యిహచింతల నుంచబోకవి
మానము - సంచితములుదీను మంచిసాధనను నీకెంచి
శాశ్వతపదవి గాంచి సుఖింపుము - యంచ నెలవియు
గాసిమాయను ద్రుంచి నిర్మలులైన వారు-పంచ నేమియులేక
తమలో పంచకోశా తీతులౌదురు. ।అంత।

5 దండివారెరిగించిరా మార్గము విడకుండిశమిలోగాంచినా-
పండితులకే దైవబలము - భావమాఖండలు జేర్చ యే
దుండగములు లేవు-నుండలత్రిగుణములకు నాదల నింకిపెలి
గెడు దరియ గురుకృప ను డజూచినజాలు భాకెం పంతునై
పరమెరిగెదవు నీ ।అంత॥

## 41 తత్త్వము

(ఆనందభైరవి - ఏకతాళము)

1 గురుదేవా నీవే యాధారము సుజనులబ్రోవ కరుణాన్వితుడ
వైతివి - నినుగానియాస దురితములనుదుంచితివి - పర
మాత్ముడవబరగి పరమార్థికమైన- తెరవు వెలుకపరచి
సుస్థిరులజేయుగనీవె - వరదుడవు వైకుంఠవాసివి వాంఛ
లెల్లను దీర్చుప్రియుడవు-మనుజను సన్నుతుగొలిచెదు
మార్గమున నిలుపవెదయుతో ॥గురు॥

2 అందుయందరాని బాధారహితుడవై నీవుండుచని విందు
రవని-పరిశుద్ధాత్ములందు నివసింతువనీ - నిందాగనీకథ
లందినబుధు లెల్లానందముతో నితం మొందుజూడక నిన్నే

పెంపమున నిలిపియును భవములనందిబోరసి నీదుకృపకై -
ముందుగా నీపదములకు నే వందనంబొనరింతు ననిశము
॥గురు॥

3 మానాశసనుగొలచు మాన్యులకును నీ ధ్యానమె సుఖ
రూపము - విషయములచే సాధనముగోరి దృఢవ్రతులై
నిన్నుజేరి భజియించిన భారము నీదేకదా - శుభములను
గూర్చి పోరి మాయను మీరి సర్వాధారమా నీస్మరణ
విశ్వాకారమై వెలుగొందు-నినుగను దారియని దలచెదరు
భువిలో ॥గురు॥

4 వాసవార్చితుడవై భాసిల్లు పరలోక వాసియని బాగ
డొందినా - నీవెవరవో దాసగాలవరిజేర్చినా-యీశుడవా
దరియా దేశికమూర్తి నీదాసాడనా భాసింపాసు ననుకడ
తేర్చ-దోసిలొగ్గిభజియింతు పరమోల్లాసపరశివ భక్త
వరదా - యాశజెందిన నీకటాక్షము గాసిదీర్చునటంచు
మదిలో ॥గురు॥

## 47 తత్త్వము

(నాదనామక్రియ - ఆదితాళం)

1 మాయామయమౌ జగమును జూచియు హాయినిమరచెదవా
ఓమనసా హాయినిమరచెదవా-ధ్యేయమైన యీయాత్మను
గలయుచు బాయకమెలగగదె ఓమనసా హాయినిపీడవే
॥మాయా॥

2 అవ్యయరూపా యఖిలముదెలుపా - సవ్యచారిత్రా సత్య
సంకల్ప ॥శ్రీగురు॥

3 అన్నియునీవె యాధారుడవె-సన్నుతిగాన వె సాక్షివిగా వె-
నిర్మలచరితా నిగమాతీతా-ధర్మసంభరితా పాపవిఘాత-
త్రిగుణవిదూరా అగణితధీరా యగుణాచారా ॥శ్రీగురు॥

4 దాసనుపోషదరియాహుస్సేనీషా - భూషితభూసా పుణ్య
విశేషా తంగెళవరదా దయయుంచరా మంగళమొగద
మహాసుబోధా ॥శ్రీగురు॥

## 49. తత్త్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 పరమమోక్ష పతీవిభుండవయా - మునుభాగవతులెపు
డాయకను నినుగొల్చుచుందురయా- మరువకను నీమృదు
పదంబులు శరణమునినాహృదయమున నిడి-స్మరణజేయుచు
న్నన్న నను నీ కరుణజూపియు, గావరావె ॥పర॥

2 సకలలోకములేలుదొరవయ్యా-నీవెడవనుచును సాక్షిగను
వెలుగొందుచుందువయా - సుకరముగ నిన్నాత్మలో పరి
శోధనము జేయుంగనీవె-ప్రకటమై భవబంధములనెడ బాప
గలవని ప్రస్తుతింతును ॥పర॥

3 నీవుగాకను వేరులేదయ్యా-నినుగన్నవారలు చావుపుట్టువు
లేకయుందురయ్యా- దేవదేవుడవైననీవె దిక్కటంచును
దివమురాత్రియు - భావమున పరిశుద్ధులై నినుబాయకను
భజియింతురయ్యా ॥పర॥

4 యోగిజన వంద్యుడవునీవయ్యా వినుదలచువారల- భాగ్య
మేమని బలుకినవునయ్యా - తామసప గర్వాములకును
తెలియబడని నీకృపావన - దరియు గురు పాదములరెంటిని
గలియజూచిన తెలియునయ్యా ।పర।

5 ధరను ఖాశీం నామమోయయ్యా యితరంబులేకను-దృష్టి
కావల నుందువోయయ్యా - సోమసూర్యుల భావమొం
గియు రాకపోకలు లేవితావున - వారికలంబుగ నుండు
వయ్యా ॥పర॥

## 50. త త్వ ము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 మాయామయమై యున్న దేహము దీనిబాయ పరమాత్మ
సహాయము - హేయమా విషయముల ద్రోయువారలు
భువిలో-న్యాయవర్తనులై యుందురెపుడు హాయిచె
నఖిలాత్మగందురు ॥మాయా॥

2 బుద్ధికుశలత గలుగువారలు భువిని శుద్ధులై శుభరూపు
లామరూ-వద్దికతో గురుని పద్దుబూనినవారు - శిద్ధులై
శివరూపులౌగురు-వారె పద్ధతెరిగి భవమునందరు
॥మాయా॥

3 విపరీతములు వీడువారలు గురునికృపగలిగి గురుతులో
నుందురు- విపములన్నియువదలి నేర్పరులవువారె సఫలులై

సదయాత్మగొల్తురు-ధర్మనిపుణులై చపలమును గెల్తురు
॥మాయా॥

4 ఖండమావుల రీతిజగమని దీని ఖండనబాయుటె మహా
ఘనమని - పండితు లానందపదవిలో నిలచియు - ఖండా
ఖండములను గలియరు ధరను దండివారె ధర్మమీడేరు
॥మాయా॥

5 మందమతులకు దెలియరానిది హృదయమందె నివసించు
పరమాత్మదీ - సందియములు మాని బంధరహితులెల్ల
అందియానందమైయున్నది సుజన బృందమెప్పుడు బూని
యున్నది ॥మాయా॥

6 ధరణుదరియాగుముని సేవలో వరుసదప్పక మెలగువారిలో-
పతితపావనమగుచు హితవుగగనువారి మతిలో మహిమను
జూపుచున్నది - మరి యేగతిలేనిదని ఖాశింగన్నది
॥మాయా॥

## 51. తత్వము

(నాదనామక్రియ - మిశ్రగతి)

1 ఉన్నదిఉన్నట్లు దెలియకున్న సుఖము లేదురా - నిన్నునీవు
గాంచ నీకు భిన్నమేమిలేదురా ॥ఉన్నది॥

2 భ్రాంతిమూలమైన జగము చింతలపాలౌనురా-వంతనొంద
ఫలములేదు అంతుదెలియబోదురా ॥ఉన్నది॥

3 ప్రాప్తఫలము విడువబోదు తృప్తిగలుగ మేలురా-సుషుప్తి
జాగరములు నెచట గుప్తమౌనో దెలియరా ॥ఉన్నది॥

4 తెలివిగలిగి యున్ననీకు కలుషమింత లేదురా - సిలకషడ్గల
యోగ్యులకును అలసటేమి లేదురా ॥ఉన్నది॥

5 యముని బారిలోనజిక్కి క్రిములనొందజాలదురా - క్రమము
దప్పి మెలగువారిని భవములపాల్జేయురా ॥ఉన్నది॥

6 దేహమునను దేహినరయు యూహగలుగ జాలురా -
దూహకముల బోవరాదు అహమునణచ లేవురా ॥ఉన్నది॥

7 దృష్టికావల నీవనెవరో స్పష్టపరచి చూడరా - సృష్టియెల్ల
గాంచితాను దృష్టవంతులైరిరా ॥ఉన్నది॥

8 భయములెల్ల విడవగురుడు - నయముగా బోధించెరా -
దైవరూపమనుచు మనకు ధర్మములను దెలిపెరా ॥ఉన్న॥

9 శోచితోచకున్ననీకు గోచరమిటుగాదురా - దాగియున్న
ధనమునీవు జూచి సుఖము జెందరా ॥ఉన్నది

10 యీశుడైన దరియాగురుడే క్లేశములను బాపురా - మోస
మేమి లేదటంచు ఖాశిందాసు దలచుచుండురా ॥ఉన్నది॥

## 52. తత్త్వము

(నాదనామక్రియ - మిశ్రగతి)

1 వందానమయ్యా (శ్రీ) గురుచంద్రా వందానమయ్యా -
వందాన మిదెగొనుమీ బంధాంహితా నీకు - సుందార
చరణార విందములనుగొలుతు- అందుయిందనకాక నీవే
కందు లేకను యుందువని - బుధు లెఱుదరో నీసేవ జేయుచు
విందుగా వినుతించిరటభువి ॥వందాన॥

2 నినుదలతునయ్యా భువనములందు ఘనుడవీవయ్యా - అజ్ఞా
మాత్రమైన చిదాత్మను - గనుమార్గమును దెలుప మూలమై
ముజ్జగంబులు - యనుపమాన యభేద్య యాశ్రిత జన
సుపోష జగద్విలక్షణ క్షణికమా దేహాద్యవస్తుల దునుము
దోషవిదూర నీకిదె ॥వందాన॥

3 పావనమయ్యా నీచరితాము సేవానమయ్యా - కోవిధనుత
పరమగోప్యమా నీమహిమ - కేవలానందమై కీర్తింపబడు
చుండ - భావమున పరిశుద్ధులెల్లరు బాయకను నిన్నేస్మ
రింపుచు - సావధానముగాను శాశ్వత సౌఖ్యమును బడ
యుదురు స్థిరులై ॥వందాన॥

4 మరువబోనయ్యా నీకృపగలుగు తెరవెవ్వరయ్యా - పాం
పూలన్నియుదీర్చ్చ వేదవేద్యుడవనుచు - మరుగుజొచ్చిన
నన్ను మన్నింపక నెవరు - ధరను దరియా గురునిరూపము
దాల్చి భక్తులబ్రోవనీవై యరుగుదెంచితి వనుచు - ఖాశీం
పరముజేరెదు తెరవుగోరెదు ॥వందాన॥

## ౫౩ తత్వము

(నాదనామక్రియ - ఏక తాళము)

1 గురుకరుణకు సమమైనభాగ్యమిక ధరలో వెదకినగలదా -
యిదె తెరవనుచును వినవలదా సత్ పురుషులసంగతిగాదా
గనరాదా - మరువకమదిలో నిల్పినవారలు మహనీయులు
జనుమార్గముగందురు ॥గురు॥

2 సంసారయమములు బోనవబడిన వారికి సుందరయుంబులు లేవు-
సుఖమిందేనుని గనగలవా - భువి మించినటిది నీవు గావు-
యిటు రావు- అందముగను పూరించమయుదవై - యుండవు
నీకే బంధము లుండవు ॥గురు॥

3 నాటిదప్పకను మాటినడుమను- కోటిపాపమ్ము దిటువలె వారా-
యీ బాటను నడచియు గూడా - జంజాటములను దిగనాడు-
అదెంతో సు - చోటిన్నాను పెదవాదములకు - నీతోటి వార
లతో కూటము జేయుము ॥గురు॥

4 అంతరజ్ఞప్తిచె నిలచి ఆత్మారాముని చెంతను నిలచిన జాలు -
బహుసంతోషంబవు మేలు - యిహచింతలన్నిటి దోలు -
వివిధాలుగల పంతంబులు- బోజావిన వారలై - శాంతినిల
యులై శాశ్వతుగలతును ॥గురు॥

5 పరలోకమునకు బాంధవుడవు శ్రీదరియాగురువరు సేవా -
నిజధర్మంబులకు త్రోవా - సర్వార్థము దేయునతేవా - విన
రావా- అరమరలేకను భాశీందాసుని తెలుపుదిద్చగల వేద
సారమా ॥గురు॥

## 54, తత్త్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 యోగమును సాధింప దెలియునురా - భవబంధమిడుటకు
బాగుగను భావింపవలె వినరా ॥యోగ॥

2 యోగమనగా వేరె లేదు- భోగులకు గవరాదు సర్వత్యాగు
లైతె గాని దెలియదు- యోగమాంతంబైన సౌఖ్యము
॥యోగ॥

౩ కర్మవశులకు గానరానిదిరా-నిష్కర్ములై తే-మార్గమున
గను భాగ్యమిదియేరా-దుర్వాసంబుల ద్రుంచి కేవల ధాత్రి
సూత్రింపెకుగువానికి-నిర్మలంబై నిత్యసుఖమై నిర్వాణుల
నీతిమార్గము ॥యోగ॥

4 యెంతవారలో యెరుగగలదిదిరా - సుషీచారకులకు
సతతసంబై సాధ్యపడినదిరా - మంతనంబుల ద్వారకబోసిది
మహితమై మర్యాదగలదై-సరెకూట భ్రాంతులన్నియు
సమయఁజేసె సత్వగుణులిల ॥యోగ॥

5 నిశ్చితులకిది నియమమైనదిరా - నిత్యానుభవమున-పశ్చి
మాంతర వీధినున్నదిరా - దుశ్చరితులను గోరరానిది
దూష్యమేమియు లేనిదని మును - కశ్యపబ్రహ్మదులాదిగ
ఘనముగను భావింపబడిన సు ॥యోగ॥

6 హృదయమున నే పదిలపరచునురా - యితరులకు తెలియని
విధమిదే వివరింపబడినదిరా - వదలకను తనలో నె తానె
ముదమునను గను మోక్షమార్గము-విదితమై విపరీతముల
కును వేరుగానున్నట్టివేద్యము ॥యోగ॥

7 ధరనుదరియా హంసేక్షణ సద్గురుని - కరుణామృతంబై
వెరపులను బాపుటకు యీభువిని - సరసమై సజ్ఞానాత్మ
కంబై సాధనముల కసాధ్యమవుచును-నిరవయనమై ఖ్యాతిం
దాసుకు వెరపుదీర్చెడు విధముగలిగి ॥యోగ॥

ఫలము-లేశమైనను లేక - భాసురంబౌ పరిపూర్ణ విలా
సమును వివరించినిత్యము- క్షేమకరహితంబైన యీ యోగిని జూచి
మరుపక సుఖారంబని ॥దేశి॥

2 భూతపంచకమైన జగము దీనిచేత నెవరికిదెలియదనుము -
జాతకమూఢగవిష సంఘాతములనుగప్పి-భూతలంబున గనక
జాతకంబునుగాదు -లో- తెరంగును గాంచువారికి జ్యోతి
రూపంబనుచు నొకటై-ఖ్యాతిగను గనుపించు గురుకృప
చేత దెలియును దెలియుటకునటు ॥దేశి॥

3 లింగాంగ విధమెఱుగకున్న సర్వసంగరహితంబౌటసున్న-
మంగళప్రదమై తేరంగు వెరిగెదమున్న - శృంగాటకమున
మెలుంగవలెననిశము-యీ గీతులకీవిధము తెలియు ప్రసంగ
ముల భావింపబడదీ-సంగతిని గనుగొనుటకును గురుపుంగ
వుని దయ గలుగవలెనిక ॥దేశి॥

4 మూడు యేరులుగలియు చోటా మఠము గూర్చియుండుట
నదియే బాటా- వేదూకతోడ పై మేడాలా నిలచిన చేసియు
గలదందు తోడైనశుభముల వీడుచా-జాడదెలిసిన జాబు
నిక మనవాడగలిపిన ఫలమా- వైభవముజూచుటకు తా న
నీడయై నిజమెఱుగువారల తోడుగా నున్నాఁడు జగమున
॥దేశి॥

5 సార్థకమైన సర్వార్థములనుగూర్చ - వ్యర్థములను వదలు
వ్యవహారము బూనగవలెను- తీర్థయాత్రలు నిండియుండిన
దివ్యస్థలమీ దేహమనుచును - అర్థులను రక్షింప దరియా
అప్తుడై యున్నాఁడు దెలియు-పార్థితుండై యుండెఖాశీం॥ దేశి॥

## 57 తత్త్వము

(శంకరాభరణము—మిశ్రగతి)

1 పరమామృతంబౌచు బరగుపరమాత్మను నా - తరమా
వర్ణింప భువినీ దెలియ - నిరుపమానందమై నిర్వికార
మవుచు - తరుగుమరుగేమిలేని తరతరంబులుమిగిలి కేవల-
ధార్మికులు గనుదారియై-(శ్రీ)కరముగను కళ్యాణయుతమై
కారణాద్యుల కరుణచేగను ॥పర॥

2 అందుయుండగ రాక ఎందుజూచినను - యింపొందియున్నది
నిండుగా విషయానందమేమియుగాక - బంధరహితంబౌచు
అందారికందదుగా-సందియంబులువీడి పరసుఖ మందగోరిన
వారికెల్లను - ముందు వెనుకన రాకనతఁట - నందియున్న
యాత్మరూపము ॥పర॥

3 దేహి దేహములను తెలివినియేయుని తెలియు - యూహా
పోహాలులేనిదీ-సర్వామోహములనువీడి - ద్రోహచింతన
లేని సాహసమమరినదీ-బాహుబలములకందరాకను కూహ
కపు విద్యలచె తెలియక-యిహాముపరమును వివరమెరుగక
విశ్వరూపంబైనదదియే ॥పర॥

4 ధరనుదరియాగురుని కరుణచేతను-పరమునరయుటకు తెర
వాయెను-మనవకనుఖాశీం మర్యాదగాపాడ- దురితములు
దూరమాను ॥పర॥

## 58. తత్త్వము

(శంకరాభరణము - ఏక తాళము)

1 దేవదేవుని తెలియలేవా-నీవు కావరము గనీవుగానకున్నావు-
నీవెవరో నిన్నెరుగరావా - సర్వజీవులు నీవనుచు నీవెరుగ
బోవ ॥దేవ॥

2 సతమా సర్వము విడచి వ్యత్యస్తములు జూపు విషయముల
బారి - అత్యాసగలిగినను సుఖము నగోరీ - మృత్యుభయ
మును లేక మరతువట కోరి ॥దేవ॥

3 భక్తిశ్రద్ధలు గలిగియున్న బంధ ముక్తులు నెరుగని పర
మాత్ముడున్న-యుక్తమానే తెలియునన్నా-మాయాశక్తి
సహితమైన జగములు సున్నా ॥దేవ॥

4 ఆరాటములు పొందబోకు సకలాధారుని ధ్యానంబె దరి
యానునీకు- ఘోరాశలనుజిక్కి చెడకు యీధరణి ధన్యులకు
తారియా తనకు ॥దేవ॥

5 ధరను దరియాగురుని కరుణను నీవు భావమందుననుంచి
ప్రార్థించియున్నా- ఏవారు లేకుండ ఎపుడు సర్వాత్యాగ
ముతో శ్రీమ:దునను ॥దేవ॥

## 59. తత్త్వము

(ఆనందభైరవి - మిశ్రగతి)

1 ననుకడతేర్చుమో ఘనముగు దేవా - వినయముతో నిను
వినుతించెదాను ॥నను॥

2 మాయామయమని మదిలో నిను నే - బాయక దలతును వాలించగదే ॥నను॥

3 ఎన్నాళ్ళకు నినుసన్నుతిజేయక - మన్ననగలదే మహనీయ భువి ॥నను॥

4 ఘట్టిగనీపద కమలములెదలో - పట్టుగనిల్పియు ప్రార్థన జేతును ॥నను॥

5 సమయమిదే నా స్తవమునుగైకొని - సుమతులగమగొను క్రియమున నిల్పియు ॥నను॥

6 అందరిలో నను నుండగజేయకు - వందనమయ్యా సుందరమూర్తి ॥నను॥

7 డక్కనీవె నాదీనతబాపవె-చక్కనిస్వామి నన్ను చిక్కుల బెట్టక ॥నను॥

8 తెలిసి తెలియకను మెలగితిధరలో - తొలగజననుచు నన్ను కలవర పెట్టక ॥నను॥

9 అసత్యోద్ధారక కోపము జేయకు - నాపై దయతో డదావున జేర్చియు ॥నను॥

10 బాధలపాలౌ భవములనుంచకు - వేదవేద్యనిన్ను కాదన నెవ్వరు ॥నను॥

11 దాసపోషణ శ్రీహరియాగురువర-మోసము చేయకు అసించి తిని నిన్ను ॥నను॥

12 ఖాకేందాసుని వేసటబాపవె - యీశుడవని నే దోసిలొగ్గితిని ॥నను॥

## 60 తత్త్వము

(జేహాగ్ రాగము - మిశ్రగితి)

1 అన్నిరూపములవుచు నగుపడెను దేహముల - నున్నపర
మాత్మ తానొక్కఁడెగాదా- భిన్నమై దోచుమను భీతి
గల్పింపునవి - సున్నగాకను వేరె నున్నదనగలవా॥అన్ని॥

2 ఆదిఅంత్యముగలిగి అపరాధముల మునిఁగి - మాధవుసిగన
కున్న మర్యాదగలదా - పాదుకొని పరతత్త్వశోధనకు
దూరమై - నాదినీదనుమాయ వేదనలేలా ॥అన్ని॥

3 ధన్యత్వమొనరించి ధరణీధవునిసేవ - అన్యమురుగనిబోధ
కాధారమాను - సూన్యులకుగనరాని శులభసాత్రింబిడి-
మాన్యులకుగనగలుగు మర్యాదయవు ॥అన్ని॥

4 భక్తవరాదీను భగవాన్ అనిమునులు-ముక్తికొరకై చాల
మోదముదఁచు-వ్యక్తిగలిగియుభువి యీశుడవై యీశు
గొన-భక్తితోసర్వేశు బాలింపనవును ॥అన్ని॥

5 దివచంద్రతారలకు దిగ్దేవతల కాది - దేవుడవని మునులు
దెల్పువాక్యములు-వివరింప వేరులేదను యీశ్వరులకును
కవులకల్పన లవు ఋషుల ॥అన్ని॥

6 దరియాపహుశేన్ షా గురుదైవముఁనుచు-నీ తలపులోనుంచి
నను దరియానను మూ-వెరపు లేదిక నాకు వ్యాప్తమైగురుని
మరువులేకనుగొల్తు మర్యాదతోను ॥అన్ని॥

7 ఖాశీందాసుని గాసిదీర్చి (శ్రీ) గురురూపంబై యిలనూ
అన్నిటయున్న ఆరాత్మను తనలో యున్నదైవమును
జూచేన్ ॥అన్ని॥

## 61. తత్త్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 వందనంబిదె జేతు గురుదేవా నాపైని దయతో బంధముల
బరిమార్పవిటు రావా-ఎందు వెదకిన నీవె సర్వానందమయుడ
వటంచు నిర్మలులందముగ నినుగూడి విషయములందు
జేరక నిత్యసుఖులై-యుందురని నినుముందుదలచెదను గత
ద్రోహములను - క్రిందుపరచెదననుచు గొలచెదను -
మందుడను మర్యాద దెలియని మానవుడనని నన్ను జూడక-
పొందుగను నీచరణ సన్నిధి- నందజేయవె సుందరాంగ
॥వంద॥

2 పరమపావనమైన నినుజేరి నీకంటెనితరము నరయకను
నిజమెరిగి నినుజేరి-పరువుబారక యింద్రియంబుల పద్ధతిని
గురుతెరిగి నీపై గురిచె- మాయా నటనలన్నియు గోర
కను బ్రహ్మానుభవమున - భరితులై భవవారధిసిగడచి
నీలోగలచెదు- తెరవిదేయని ధీయుతులుజూచి కరుణగల్గి
తెల్పువాక్యము - స్థిరమటంచు నమ్మినీకృప నరయుభాగ్య
మొసంగుటకునిను మంతకును మదిలోననిల్పియు ॥వంద॥

3 నమ్మరానిది దేహమని దెలసి దేహాభిమానము సమ్మతింపక
సాధువై నిలచీ - యిమ్మహీస్థలమునను గురువరు సమ్మతిని
గని స్వార్థమును నెగజిమ్మి - చిన్మయులవుచు హాయిని
నెమ్మదిగ బొరెయుచును జగమును - బొమ్మలాటగ జూచి

నిలచిరిగా-అవివేకమెవ్వఁడుక గ్రమ్మసీయక గనతగాంచిరిగా -
నమ్మినమ్మక నుండుసంశయ నిమ్ముగను జేర్చకను నీలో-
తన్మయత్వము నొంది శాశ్వత ధర్మములన ధర్మాత్ములైరని
॥వంద॥

4 అన్నినీవైయున్న నిజమెరిగి సకలార్థ సాక్షిగ నెన్నినీకథ
లానుటకు మరిగి-భిన్న భిన్నములైనమాయను - యెన్న
డైననుజూడ నేరక యున్ననతోనిను జేర నెంచియు-నన్నలకు
మిగిలున్ననిన్నే యెన్నుచును విశ్వంబులోపలను-విబుధాళి
మరువక నున్న వారిని విన్నదాదిగను- పున్నతోన్నతమైన
నీవె నన్ను దయతో బ్రోవగలిగిన - కన్నతండ్రివటంచు
నెరిగియు ఘట్టిగా నీ భజన జేయుచు ॥వంద॥

5 ఆశజెందియు దోసిలొగ్గితిని (శ్రీ)సద్గురువ ప్రభో నీరమానులు
లేనిదెరిగితిని - మోసమేమియు జేయకూ నాగాసిదీర్చెద
పనుచు నమ్మియు - భాసురంబై వెలయు నీకృప జేసినీ
నామామృతంబును-దాసదాసుడ నౌచుగ్రోలుచును-దరియా
హుస్సేన్‌షా దేశికుడవని మదిలో మరువకను - వేసటలు
లేనట్టి నిన్నెడబాసినను ఫలమేమిలేదని దోషములు
దొలగుటకు-ఖాశీం దాసుడను నీదయనుగోరియు ॥వంద॥

## 62 తత్వము

(నాదనామక్రియ - ఆదితాళం)

1 స్వయంభవుడవై భయంబుబాపెడు-దయామూర్తివని యం
దురు - రయంబున నను రక్షించుటకును మహానీయుడవని
గందురు ॥స్వయం-

2 చరాచరంబుల కాధారంబౌ స్వామివి నీవనియందురు - విరాగభక్తుల మొరాలకించె నిరామయుడవని గందురు - పరాకులేకను పాలనజేసే ప్రభుడవునీవనియందురు- మొరాల కించియు విరామమొసగే మూర్తివినీవనియందురు-గణింప నీవేఘనుండవని నీ గుణంబులెగనుచుందురయా ॥స్వయం॥

3 గుణాతీతమై గురుతుదెలుపు సద్గురుడవు నీవనియందురు - గణింప నీవె ఘనుండవని నీ గుణంబులెగనుచుందురు - సదానీభజన ముదంబుగూర్చుట యదార్థమని బుధులం దురు - నిదానమున నీకథల్ వినుచు నిదె సుధామయంబని గందురు ॥స్వయం॥

4 ఆత్మానాత్మల జాడదెలియుటే యధికంబనిఘనులందురు- ప్రత్యక్షంబని భావములోపల భాగవతులుగనుచుందురు ॥స్వయం॥

5 ధరలో దరియా గురువరుసేవయె ధన్యతగలదనియందురు - వెరువకు భాశీం దాసునికిదే వేడుకయని ఘనులందురు ॥స్వయం॥

## 63. తత్వము

(ఆనందభైరవి - మిశ్రగతి)

1 మహనీయ నీకృపయె మానవాళిబ్రోవ మర్యాదగల దాయెను-వివరింప నిది బహు జన్మఫలమాయెను- కహాన మున నినుదలచు సత్ పురుషశ్రేణిలో- వివరింపుచుందువని

వేడుక చెబుధులు - అహామునణాదియు యాత్మసుఖమున-
యిహాపరంబుల రాశి నీవె - భువనముల పాలింతువని నీ
స్తవమునను భవరహితులైరట ॥మహా॥

2 అంగవిలక్షణ మంగళ ప్రభ నీవె సంగాము లేకుందువు
సర్వాత్ముడవై భంగ మేమియు జెందవు-రంగుమీరిన నీ తె
రంగు గను వారల పొంగుచు నీకథలె-శృంగారముగ వినుచు
జంగమస్థావరములందున-నింగిపోలిక వెలుగు నీఘనసంగమున
సర్వార్థములు గొని సంతసింపరె సాహసులై ॥మహా॥

3 అన్నిరూపములకు ఆధారమైయున్న నిన్ను - యెన్నుచు
సర్వము నీవె యనుచు భిన్నపరచక సనిశము-మన్ననతో
నీదు సన్నిధి బాయకయున్న వారలెనిన్ను గన్న వారౌదురు-
తన్ను దెలియని వారు నీభువి నెన్నిటికినిను దెలియబోరని-
భిన్నమౌ మాయావిలాసము తిన్నగా విడదీయు మేలౌ ॥మహా॥

4 దండిగ నీకళల నుండజూచినవారె - నిండి నీలోనుందురు
యితరముగ నక - కుండలాగ్రముగందురు-పండితులెల్ల నీ
యండ జేరియుగాదె-మొండివాదములెల్ల ఖండించి ఘనులైరి-
మండలత్రయములను మీరియు - ఖండమై వెలుగొందు
నిష్కళ నుండి వీడక నీపదములు - మెండుగాగని మెలగు
చుందురు ॥మహా॥

5 వాశీగ దరియా గురుదేశిక మూర్తివై వేసాట లేకుందువు
భక్తుల హృదయ నివాసివై వెలుగొందువు - మోసాము

లేని నిర్వాసనగల సుఖము భాసిలుండిన విషయవాసన గలదని - ఆశచే ఖాళీందాసుని వేసటలు కాయుటకు నిది యభ్యాసమని దినదినము మరువక ॥మహా॥

## 64 ద్విపదార్థములు

(శంకరాభరణము - ఆదితాళము)

వద్దికతోడను వాంఛలు వీడి - శుద్ధత్వమున పరశోధన జేసి
అద్దములో నీడ నరయుచందమున - సిద్ధులై దివ్యాత్మ
చిత్తంబులోన ॥బద్ధత లేక గందురూ॥
బ్రహ్మానుభవులై యుద్ధర పెలయుచుందురు - కద్దూలేదను
వట్టి రద్దూల పాలుగాక - హద్దూగనిలచి నిశ్చయార్థులై
యనవరతము ॥బద్ధత లేక గందురు॥

## 65

నూటిగా మనసు సుషిరమున జేర్చి బాటవీడక కలుష బంజనులౌచు - బూటక జగమని పొందుగోరకను నాటక ధారునీ నయములో గాంచి ॥కూటాము వీడకుండేరు॥
కుశలులై సుజనగోష్టినిగూడియుండేరు - ఆట పాటలనైన ఆత్మానుభవమువీడక మేటిపదవి గోరిలితి - సాటిలేకున్న దని ॥కూటాము వీడకుండేరు॥

## 66

నిజతత్వ మెరిగియు నిర్మలులౌచు కుజనులగూడక కోవిధ వంద్యు - భజన జేయుచు చాల భక్తి శ్రద్ధలతో

విజితేంద్రియత్వమున వెలయుచు తాము ॥గజిబిజిలేక గందురూ॥

ఘనులౌచు నెంగు విజన స్థలమునుందురు-అజహారి రుద్రు లాకు ఆధారమైనవాని - సుజనూలుతమలోఁజూచి సుఖ రూపులవుచు నెపుడు ॥గజిబిజిలేక గందురు॥

67

(శ్రీ)కరంబౌ గురుని సేవింపుచుండి లోకవార్తలు మరచి లోకేశుగాంచి - పాకమెరిగిన వారి పద్ధతుల్ వినుచు ఏకాంతమున పరము వీక్షింపగలిగి ॥శోకామోహము జెందారు॥

శుభగులై సత్యలోకాము నందె నిలచేరు-చేకొని గురుని యాజ్ఞసిద్ధిగలిగినవారు రాకపోకాలు లేని-ఏకావమా పదవి గనుచు ॥శోకామోహము జెందారు॥

## 68. తత్త్వము

(నాదనామక్రియ - ఏకతాళము)

1 గురు కరుణామృతము నంద గోరిన నరుల దురితము లన్నియు దొలగునె మనసా- హృదయమందున గురుని వడలకయున్న పదిలమా పరతత్త్వమొదవునె మనసా ॥గురు॥

2 ఆరుచక్రముల యందమరీనహంస - పాదుదెలిసినభవము బడద్రోయుమనసా-కూటస్థానమునందు గురినిల్పియున్న- దీటులేని పరము దికొ్కనె మనసా ॥గురు॥

3 కలవంటి సంసార కలవరములలో తలపుంచకను పరుని దలుపావె మనసా- వెలిలోను వ్యాపించు విశ్వేశుకృపచె బలమైనమాయాను బడద్రోయుమనసా ॥గురు॥

4 అంగవిలక్షణసంగతిదెలసి- భంగాముగానున్న భయమేమి మనసా-బాసులబ్రోచెడు దరియాగురువరుని శాసనంబును విడువ జనదె ఓమనసా ॥గురు॥

5 దోసిలొగ్గిన భాశీందాసు యెల్లప్పుడు - దేశికుని సేవయే ఆశించెమనసా ॥గురు॥

## 69. తత్వము

(ఆనందభైరవి - మిశ్రగతి)

1 గురునికరుణ బడయువారలు నిజతత్వమెరిగి - పరమపదవి చేరుధీరులు-నిరతమానందాబ్ధిలోన నిలచి నీతివంతులౌచు- తరుగులేని సుఖముగలిగి-ధన్యులైరి ధాత్రిలోన ॥గురుని॥

2 తలపులుడుగు తావుజేరియు తమలోనవెలుగు - కలిమిగోరి కలతదీరియు - వెలిని లోను ఏకమవుచు వెలయుసర్వ మయునిగలసి - మెలగివిషయరహితులౌచు మెళకువాత్మో మేలుగనిరి ॥గురుని॥

3 నాదమున వినోదమందియు ఆద్యంతమనని - బోధగలిగి మోదమందియు - నాదినీది యనెడు మాయ పాదుపీడి భావమితర శోధలను జొరక పరమ సాధులై భవబంధ మిడిరి ॥గురుని॥

4 హాయిగలుగుఅజపమెరిగియు-అభ్యాసమున హి ధేయులవ్రుచు
ఛాయ కుండియు - మాయ మవుటకిదియు సాయమైన
మార్గమనుచు - ధీయుతులఖిలాత్మగాంచి కాయములను
గానరెపుడు ॥గురుని॥

5 పెక్కురూపులైనజగమున సర్వేశ్వరుండు - ఒక్కరూపు
డనుచు నెరిగిన-జక్కపడును జన్మఫలము చిక్కులేమి లేవ
టంచు - మక్కువతో దరియాగురుండు మర్మమెరుకపరచె
ఖాశీం ॥గురుని॥

## 70. తత్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 శ్రీకరంబగు దేశికప్రభుని పదపద్మములు గనలేక విరుగుట
వ్యర్థమాయువని - రాకపోకలు లేని పదవి నిరాకరించిన
వారికెప్పుడు - లోకభ్రాంతియెగాని మరియే లోకమున
విశ్రాంతి గలుగదు ॥శ్రీక॥

2 ఆదిమధ్యాంతములు లేకున్న నిగమాంత వేద్యుని - మోద
మునగనసుఖముగలదన్న-పాదుకొనిబ్రహ్మండమునకును
యాధారంబై సకలదిశలను - వేదవేత్తల యనుభవంబున
బోధపడు నిజతత్వమెరుగుము ॥శ్రీక॥

3 చూపు రూపము లొకటియా విధము నీలోన గలిగిన
వ్యాపకుని గను తెరవు యిదియనుము - లోపమేమియు
లేక యావరలోకమున జేరుంటివా-యేపాపములు నీదరికి
రావని - తేపతేపకు తెలియుచుండుము ॥శ్రీక॥

4 హృదయము పద్మముకుదిలవరచియును వదలకను నీవా సదయు
కృపగాంచియును మెలగికను-కోరుదుపుడి కామాదివృత్తులు
వడల గలపి పథము నెరిగియు - అచలమై మెరుగును లేక
శాశ్వితపు సదనమును విడబోకు పునికము ॥శ్రీక॥

5 నాశికాగ్రప్రకాశియాదరియా గురుదేవుగొలచిన మోస
మేమియులేదు నిజమరయు - భాసురంబగు సర్వసము
నుల్లాసివై భజియింప క్లేశము బాసి చన భవనాశమా నిదె
నాశనంబన వినవె ఖాళీం ॥శ్రీకరంబగు॥

## 71. తత్త్వము

(కళ్యాణిరాగము - మిశ్రగతి)

1 వినరే బుధజనులార విశ్వాత్మకథను-పనిబూనియును వారె
పరిశుద్ధులిలసు ॥విన॥

2 ఆదిఅంత్యము లేని యానందమయుడు - వాదబేధము లేక
వకలైయున్నాడు॥విన॥

3 లోకాలోకము లేమిగాకయున్నాడు - శోక మోహాములచే
శుష్కింపబోడు॥విన॥

4 అసమానమై తాను యలరుచున్నాడు - దిశలెల్ల పరికింప
వశము కాబోడు ॥విన॥

5 సర్వశక్తివహించి సాకుచున్నాడు - దుర్వివాదములచె
దొరకకున్నాడు॥విన॥

6 సగుణనిర్గుణములకు సాక్షియైనాడు - పగలు రేయనరాని
పరమాత్మడతడు ॥విన॥

7 నాశరహితంబైన నారాయణుండు - దేశికు కరుణచె
దెలియనున్నాడు॥విన॥

8 దరియాగురుకృపగలుగ దయయుంచినాడు - పరిచుడను
చును ఖాశీం వదలకున్నాడు ॥విన॥

## 72. తత్త్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

శ్రీరామ రామరామ శ్రితగుణస్థోమ శ్రీరామ రామరామ
॥శ్రీరామ॥

1 శ్రీరామరామయనియేమానవుండైన కారుణ్యముగ ఎంతో
ప్రేమతోబిలచితె-నీమనిష్ఠలులేక ఎప్పుడు స్వానుభవమున
జూచు వారల - కామితార్థంబుల నొసంగుచు ప్రేమతో
రక్షింతువయ్యా ॥శ్రీరామ॥

2 ఏకాంతమందుజేరి శ్రీరామయని ప్రేమతో స్మరణజేయు-
ఏకాకారముతోడ ఎల్లప్రొద్దులయందు-చీకాకులేకుండ చేరి
యుందువురామ-ముందు వెనుకను సందులేకను సందియంబు
లేక ఎప్పుడు-ఆనందముగ నినుగొలచువారల డెందమందున
జేరి యుందువు ॥శ్రీరామ॥

3 బాహ్యత్రిపుటిని మరచి ఎప్పుడునూ శ్రీరామ యనిస్మరణ
జేసిన శాంతినిత్తువయా- అంతరత్రిపుటిని జేరనివ్వక సంత
తము నినుగొలచి నప్పుడు ధ్యేయమగు పరమాత్మరూపై
వ్యాపకంబై యుందువయ్యా ॥శ్రీరామ॥

4 అంతరాంతర త్రిపుటియందునా లక్ష్యార్థముంచి స్వప్రవర
చిన జ్ఞానదృష్టికి-చావుపుట్టుకలులేక కేవలాత్ముండ వగుచు
ఎప్పుడు బయలు బ్రహ్మంబగుచు నీవే ద్వయము లేకను
యుందువయ్యా ॥శ్రీరామ॥
5 వాచకంబున రామయనియూను శ్రీరామునిన్ను మానసంబున
చెదరనివ్వకను- జ్ఞానమందున జ్ఞప్తినుంచుక జ్ఞప్తికూడ
మరిచియుంతట-తానునేనను వెరుకలేకను ప్రత్యగాత్ముండ
వగుదువయ్యా ॥శ్రీరామ॥
6 రామరూపమె తంగెళ్ళార్యుండు భక్తుల కెల్లను స్వానుభ
వమై తెల్పె ఆర్యుండు-అనుభవం చే యనుచు నెవ్వడు వప్పు
గాదరియాకు వేగమె ఘట్టిగను దెల్పుదువు రామా॥శ్రీరా॥

## 73. తత్త్వము

(తోడరాగము - మిశ్రగతి)

1 ఏది ఎటుల జరుగనౌనో యెరుగ నెవరి తరముగాదు -
వాదులాడ ఫలము గలదె వసుధ నెంతవారికైన ॥ఏది॥
2 పూర్వ పుణ్య పాప ఫలము కార్యరూపమై జనించు -
నిర్వహింతునకు నీవు సర్వమయుని కరుణగాక ॥ఏది॥
3 పుట్టి భువినిబడియు మరల గిట్టువరకు ఖర్మఫలము - యిట్టి
దనగరాదు దీని దిట్టపరుపబోకు మెందు ॥ఏది॥
4 మానవ జన్మంబు పరిభుని ధ్యాన్నమునకు గలిగెననుచు -
జ్ఞానమొంది మరువనీకు న్యానమానా భవంబు విడదు ॥ఏది॥

5 జనన మరణ దుఃఖములను వెనుక ద్రోయు వాసిగాదె -
ఘనులటంచు పలుకు పుత్రిలను ఘనాభోగమున భరింపవలదె
॥ఏది॥

6 గురుని శరణ వలన తనదు గుర్తు దెలియవలెను గాని -
తిరుచు శాస్త్రములను జదువ తన్నెరుగ గలరె భువిలో
॥ఏది॥

7 తన్ను దెలియకున్న మాయ ఎన్నడైన విడువబోదు -
భిన్నమైన మార్గములకు యెన్నబోకు యెప్పుడైన ॥ఏది॥

8 చపల గుణములన్ని వీడి నిపుణతతో నిన్ను గాంచ - సఫల
మౌను జన్మఫలము అపరిమితానందమమరు ॥ఏది॥

9 వాసిగను దరియా హుస్సేన్ షా దేశికుని సత్కరుణ వడసి -
దోసిలొగ్గి ఖాశీమా నీ వాసించుము అదియె మేలు ॥ఏది॥

## 74, తత్వము

(శంకరాభరణము—మిశ్రగతి)

1 భావాతీతంబైనది సద్గురుమహిమ భవములంటకయున్నది-
కావారములుమాని ఘనులానందముబూని నీవు నేనగాని
తావుజేరిననిదియె ॥భావా॥

2 వెలిలోనిర్మలమైనది సద్గురుమహిమ కలకాలమునునున్నది-
తులలేని పరసౌఖ్యమొనగూర్చి దృఢమైనబలమొసగి భవ
బంధముల బాపుచున్నాది ॥భావా॥

3 అన్నిటతానైనది-సద్గురుమహిమ యెన్నవలవియుగానిది-మాన్నవతో తను తా గన్నవారలవరమై సున్నైనమాయ తో నెన్నడు గలియక ॥భావా॥

4 అండబాయకనున్నది-సద్గురుమహిమనిండినిజమైయున్నది-యొండమావులరీతినుండుజగమునుగనక-దండివారలమదిలో దయజూపె ధర్మామై ॥భావా॥

5 వెరపులన్నిదీర్చేది-సద్గురుమహిమ వేదావేద్యంబైనది - చరితామై దరియాగురు కరుణాకటాక్షమని-ధరణు భూశీం దాసు శరణనుచు మరువానది ॥భావా॥

## 75. తత్వము

(ఆనందభైరవి - మిశ్రగతి)

1 నిన్ను దలచెద దేవ దేవా-నన్ను మన్నించి బ్రోవనిటు రావా - ఎన్న శక్యముగాని విశ్వపాలన నీవె-కన్న బిడ్డల రీతి కరుణతో జూతువట ॥నిన్ను॥

2 కపట వాంఛలలోన బొరలి-నీను కృపజూడకను మాయ వదలి - విపరీతములచేత విర్రవీగుచు భువిని-అపరాధినైతి నన్నాజ్ఞలో నిలుపుమని ॥నిన్ను॥

3 కల్ల జగమని దెలియలేక-వట్టి కలుషములజిక్కి నినుగనక - ఆల్లిబిల్లిగ దిరిగి ఆయాసమున నీవె - చల్లగను రక్షింప స్వామి నను వెరవుతో ॥నిన్ను॥

4 ఎందరిని గాచితోవో మున్ను-ఇపుడు ఎందరుండిరో గొలువ
నిన్ను - అందరిలో నేనొకడ నతిదీనుడను- విషయ బంధ
ములు వెడలించి భవము బాపెద వనుచు ॥నిన్ను॥

5 సర్వ రూపకుడ వీవనుచు - బుధులు యుర్థిసలిని బలుక
వినుచు-నిర్విచారంబుననునీవె సర్వంబనుచు-దుర్వాదము
విడువ దోడ్పడుదువని నమ్మి ॥నిను॥

6 అంతరాత్ముడవైన నీదు-ఘనము వింత వింతలకెల్ల పాదు -
సంతోషమున నిన్ను స్వాంతమున పూజింప-చింతలన్నియు
బాపి చెంత జేర్చెద వనుచు ॥నిన్ను॥

7 ధరను దరియా గురునిసేవా-సర్వధర్మములను తెలియుటకు
త్రోవ - మరువక ఖాశీం మానసంబున నీదు-స్మరణ
జేయుగ పాపమతి సమయునంచు ॥నిన్ను॥

## 76. తత్వము

(మిశ్రగతి - నాదనామక్రియ)

1 గురువరుని సేవా-పరమార్థమును గురుతెరుగు త్రోవ-
అరలేక ననిశమును మరువాక జేయుచును - సిద్ధులైన
వారలె యీదురితాబ్ధి తరియించి - పరమ పదవికి జేరు
భాగ్యము బడయుగల సద్భక్తులని ముని-వరుసగా మహా
నీయులెల్లరు ఒక్కరీతిగ బలుక వినమె ॥గురు॥

2 యింగితపరులు యిష్టాయిష్టములు లేని బుధులు - మంగళ
కరమై చెలంగు సర్వాధారు సంగతిగని-విషయ ప్రసంగ

మేమియు లేక-హంగుగ లుగు నటంచు మరువక ఆత్మరూపము
నెఱుగుకొరకై-భంగ మేమియు లేక విజ్ఞాన పాదముల బాలించు
రెప్పుడు ॥గురువరుని॥

3 ఆదిఅంత్యము నుగాక నువెలిగే-బోధారూపమును శోధించ
గురు దేవు యాధార మేగాక-మేధావులకు యితర సాధన
మేమాను - నాదినీదని బలుక రాకను గాధలేమియు లేని
స్వప్రకాశ భ గోదనల పాల్గొని పరము-సుధామయంబని గొలు
చుటకుగద ॥గురువరుని॥

4 అతివినయమునను సేవింప సద్గతి గాంచనవును-మతిమంతులా
త్మార్థహిత మెఱుంగ గోర-(శ్రీ)సతి యేసర్వము దెల్ప క్షితిపై
నవతరించి-పతిత పావనమైన మార్గము - శృతిహితంబుగ
దెల్పి దయతో-పతన మేమియు లేని నిర్మల వ్రతముజూపిన
వారె గురులని ॥గురువరుని॥

5 పతితపావనము శ్రీగురు దరియూ పాదసేవనము-అతివినయ
మున తానా కాశా తీతంబైన-పరమాత్మ సేవించి బంధంబు
లనుద్రుంచి-పరము జెందుచునుండు ఖాశిం వదలకను-తన
హృదయమందున పదిలపరచెను భక్తితో గురుని॥గురువ॥

## 77. త త్వ ము

(మిశ్రగతి - ఆనందభైరవి)

1 గురునాధు సేవా తత్పరులైన - తరియింప తెరవౌను-
గుతిగాంచుమా పరమానంద భరితమా భజియింపుమా -
వెరవులన్ని యుదీర్చి ఈశ్వరుకరుణానుస్థిరమై వెలుగగమతి

యేదురితాములున్న వె - తరుణమిది నీవరసి నిర్మల తావు
జూచియు ధైర్యమున యేకొరతలేకున్నట్టి సత్పథ యిరవు
జేసుక నున్న మేలా ॥గురు॥

2 తెలిపినంతయెనీవు తెలివిలోజూచియుకలతలన్నియుపీడ వె-
నిజతత్త్వార్థములవిజేసుకగూడ వె - పలుభ్రాంతులనుబోవ
ఫలమేమిగలుగదు-వెలువలలోపల వెలిగేపరాత్పడు తలపు
లను దలచియు - సుధామృతధారలను గ్రోలుచు-భవాం
బుధి మెళుకువతో నీదంగ గలిగిన-తెలివియె తెలివియౌన
జెల్లును ॥గురునాథు॥

3 అతిరహస్యమైన శ్రీహరికథలు విని కన- మతిమంతులైరీ
భువినీ-సర్వాత్మసంగతి దెలియగలరీయవనీ- అతులితమహా
పదవి వెదకిజూచెను మలిన హితవుగలసినవారి జతనుండుట
యెగాని - పతితులకుగనరాని సత్యవ్రతులు దీనిని స్వాను
భవమున-గతియటంచు నెరుంగువారలె-క్షితినిధన్యాత్మ
లయ్యెదరు ॥గురునాథు॥

4 గంగయమునలమధ్యసంగములో నీవువంగిస్నానము జేయు వే-
పరమాత్మని తొంగిచూచుటె హాయియే - అంగలింగై
క్యమె అమృతపదవియనిపొంగిమహాత్మలు భోగ్యులయ్యెద
రిలను - ఇంగితుల గలిగినసుగద నిస్సంగులై బరగుటకు
నిర్మల సంగతిని విడబాయకను భవసంగమును జేరగా
వలదిక ॥గురునాథు॥

5 దాసులబ్రోచుటె తెగినపనియైన (శ్రీ) దేశికు మదికెంచవే సుజనులగూడి మోసములనుత్యజించవె - వేసటలేనట్టి విధ మిదియె యెరిగిన గాసిగలుగగబోదు - కలలోనైననునీవు ఆశలన్నియు విడచి దరియాదేశిక ప్రభుజేర అఘములు బాసి సర్వా సుధీపదవిని వాసిగా గననవును ఖాశీం॥గురు॥

## 78 తత్వము

(శంకరాభరణము,- ఆది తాళము)

1 మానసమా గురుపాదతీర్థములు మరువక గ్రోలిన మర్త్యా దవునిక - జ్ఞానవశంబున ఘనునిగానకను - హీనగతితో నీవేలచెడెదవయో ॥మానసమా॥

2 మక్కువతోడుత మాధవుపదములు దిక్కనినమ్మితె చిక్కులువిడునో ॥మానసమా॥

3 జారతనంబున వారకాంతలతో జేరి సుఖించిన దారిదెలియ దిక - నారాయణయని నామముదలచిన ఘోరకలుషములు దూరమవునుగదె ॥మానసమా॥

4 యుందుగాను దరియాగురుచరణము లందంబున యానందిం చెడు-సందియుంబు సర్వంబు సమసునో ॥మానస॥

5 దోషదోషములు వేసట లటంచెను భాసురాత్మకుని పఠియిం చును - నీఆశపాశములుతోయ నిర్మలాప్రకాశము వాసిగ గల్గును ఖాశీమా ॥మానసమా॥

## 79. తత్వము

(శంకరాభరణము - మిశ్రగతి)

1 రామా నీదగునామమేమాని వర్ణింతు పామారత్వము బాపరా - సామజా వరదూడవనుచు చక్కగా నామదివ నిల్పి - నీమముతో నీనామ మెప్పుడు వేమరక భజియిం పుచుంటినీ ॥రామా॥

2 మును ప్రహ్లాదుని బ్రోచి ఘనయశము వడసిన అనఘ మూర్తి వీవెగా - దినదినము నీసత్యకథలను వినుచు మనస మున దలచుచుండెడు-మనుజులకు యికజన్మ లేదని వినమె ఆర్యులు దెలుపుచుండగ ॥రామా॥

3 మురహారియనుచు నీదరిజేరి యుంటిని కరుణా నాపై యుం చరా - పరమపావన నీదునామము సతతమును మదిదలచు చుంటిని-అరమరేలనో బ్రోచుటకు నీయాభిమతెంబది దెల్ప వేరా ॥రామా॥

4 దాతావు నీవని దరిజేరియుంటిని పాతాకములు బాపరా - పతితపావననీదునామము సతతమును మదిదలచు చుంటిని- క్షితిని సావరప్పా లెమెందునయు తులితంబుగ వెలసియుండిన ॥రామా॥

5 దాసుడ ననుచు నీదాపుజేరియుంటి వాసుదేవా బ్రోవరా- వేమరక నీనామమెప్పుడు ఆశచె మదిదలచుచుంటిని-ఖాళీ మును దయనేలు బొరవని దోసిలొగ్గితి గాసి మాన్పరా ॥రామానీదగు॥

## 80. తత్త్వము.

(బేగడరాగం. ఆదితాళం.)

1 ఓ న్నమశ్శివాయను మంత్రం నాపాపములను తెగనఱిం
చేనురా - నమశ్శివా యని నామంబు నందున నాగురు
మూర్తి నాకు తెల్పెరా ॥ఓన్నమ॥

2 నా యనుబీజాక్షరము భూస్థానంబై యుండెనురా - గణ
పతి కెప్పుడు స్వానుభూతియై గమ్యంబై దనరారుచుండురా
॥ఓన్నమ॥

3 మా యను దెల్పిన యక్షరము మాయాతీతంబై నదిరా -
యిమ్ముగస్వాధిష్టంబున కిరవై నలువకు నెప్పుడు నానందిం
పుచు ॥ఓన్నమ॥

4 శి దెల్పినయీసిగనా మంసిద్ధయియున్నదిఘననామం-మణిపూ
రకమున మహనీయంబై పవ్వగవిష్ణుకు వందన మొసగుచు
॥ఓన్నమ॥

5 వ రూపంబై వచ్చేనురా వైరాగ్యంబై దనరెనురా -
వైరాగ్యంబన భ్రమరహితంబని రుద్రునకెప్పుడు- రూఢిగ
మ్రొక్కుచు-ననాహతంబున నాదరింపుచును ॥ఓన్నమ॥

6 యావంతైన తేజమురా ఎల్లరకును బోధింపరురా - క్షేత్ర
జ్ఞుడనుజీవుడు ఎప్పుడు కంఠంబున పలుకులు వచియింపుచు
॥ఓన్నమ॥

7 ఓంకారంబై దనరెనురా శ్రీగురుస్థానంబనవినరా - ఆరు
చక్రముల కావలయున్నది తెరచిచూచిన తానై యున్న
నేతినేతియని సీలోయున్నది శ్రీగురుతంగళ్ళావ్యాఖ్యలు తెల్పిరి
॥ఓన్నమ॥

8 మంత్రార్థంబని దెల్పెనురా సుబ్బదాసుసద్గురుమూర్తి-దీని
నెప్పుడు ధ్యాన్న మొనర్చిన తిరిగిపుట్టరని దరియకుదెల్పెను
॥ఓన్నమ॥

## 81, తత్వము

(శంకరాభరణము - ఏకతాళము)

1 నిండీఅన్నిటయున్నదీ సద్గురుకరుణ నిగమాతీతంబైనది -
తాను నేననియేటి భేదాము లేనట్టి - తావున యున్నట్టి
తత్వజ్ఞులైనట్టి ॥నిండీ॥

2 హృదయాంతమైనాదదీ సద్గురుకరుణ నిటలాంతమైనదదీ -
జ్ఞానజ్ఞానములకు తావులేకనుయెల్లా స్వానుభవులాకెల్ల -
తావూనయున్నాది ॥నిండీ॥

3 బాధాలేకున్నాదదీ సద్గురుకరుణా బోధారూపంబైనది -
సాధానములునాల్గు తెలియనేర్చియున్న - వేదవేద్యులకు
బోధమైయున్నాది ॥నిండీ॥

4 ఖండమేమియుకానిదీ సద్గురుకరుణ దండివారికైనది -అండ
బాయకనుండి కుండలాగ్రమునుండి - పండూగ సద్గూరు
పండీ యున్నాదదీ ॥నిండీ॥

5 చావుపుట్టువుకానిది యెప్పుడు పక్కతీరూగ యున్నాదది-
నీవారశోకమున నిండి యున్నవారి భావమందున తానై
పండూగై యున్నాది ॥నిండి॥

6 దండివారు గన్నది సద్గురు మక్కావాసీ రీతిగ నున్నది -
మండితముగ శాశ్వం మహనీయు లెప్పుడు-భావాభావామైన
బయలు తానై నాది ॥నిండి॥

7 సద్గురుకరుణాయిది ఎప్పుడుతన స్వాంతమందునయున్నది-
గురుకృపలేనట్టి మనుజసంఘములకు తెలియశక్యముగాని
దరియూను బోధించె ॥నిండి॥

## 82. తత్త్వము

(శంకరాభరణము—మిశ్రగతి)

1 నీకు సములిలగలరె భాశింపా నిత్యప్రకాశ చేకొనవె-నను
కృపనుభాశింపా ॥నీకు॥

2 శోకతోడుత నిన్ను దలచెను పాకమెరిగిన భక్తజనులను-
సాకగల సర్వాత్ముడవు-నీసదన మేసకలాధ్రమయమా॥నీకు

3 వాచకంబున తెల్పుచుందువయా- భాశింపలీపా మాన
సంబున ఆజ్ఞయిస్తువయా- ఆజ్ఞకూడలేనిదంచు వునికినీలో
చూపుచూను- పరమభక్తుల హృదయమూలో స్థాపితంబై
యుందువయ్యా ॥నీకు॥

4 బోధయందున శుకునివతుగాను-భాశింపలీపా నిష్ఠయందున
ధృవునిచూపును- ఐక్యమందున జ్ఞప్తిలేకను అంతరంబున
నీవెయయ్యును-ఏతట్టుచూచిన అట్టితోచుచు ఏమిలేకను
యుండువయ్యా ॥నీకు॥

5 వనరుగా ఆజ్ఞేయమందూన భాశింపలీపా పవ్వగాను ఆజ్ఞ
యిచ్చుచును-దనరుచును తాపత్రియంబుల తగులకెప్పుడు

లక్ష్యమందున - మేటి శిఖరమునను నీవైనాటిలేకను స్వామివి గను ॥నీకు॥

6 నీలతోయద మధ్యమందున - భాసింపలేపా నిరవుగాను సౌజ్ఞ యిచ్చుచును-తుదయు మొదులు లేకనీవై సదయుడవై యుండగాను-నీవు నేనను గురుతులేసితావునీవని దరియు గొసగిన ॥నీకు॥

1. మంగళహారతి

(తోడిరాగము. మిశ్రగతి)

1 మంగళముగురుదేవా మమ్మేలుటకురావ॥జయమంగళము॥ సంగరహిత పీవ ప్రసంగముననులేవా ॥జయ॥

2 నింగిపోలికనుండి భవభంగములులేకుండి - నింగితులలో నుండీ విశ్వాత్మవైతివండీ ॥జయ॥

3 ఏకమైననీవు యీలోకమున గనరావు - సాకసేర్చినావు సజ్జనులను గన్నావు ॥జయ॥

4 ఆరుకమలములలో ఆధారమైతివటులో-నూరిజనులమదిలో సుఖరూపువైతివిలలో ॥జయ॥

5 రక్షకుడైసదరియు గురు శిక్షగలుగుటరయు - మోక్షమార్గమిదియా దీక్షవిడకగలియు ॥జయ॥

6 ధర్మపథమటంచు భాసిందాను నిన్నుగొలుచు - మర్మమై నివసించు నీమార్గమెరుకవరచు ॥జయ॥

2. మంగళహారతి.

(బేహాగ్ రాగము-మిశ్రగతి)

1 మంగళహారతులివ్వారే గురుదేవునకును॥మంగళ॥
మంగళహారతులివ్వారె లింగభంగమైనగురుని - సంగము నను విషయముల నెరుంగరాని సంగ తెలిగి ॥మంగళ॥

2 సూటిగలిగి మాటిదాటియు మునమూర్తిలలోన బోటియున్న
చోటుదెలిసియు — నీటిశిఖరమునను గురునితోటిగలియు
శాటదెలిసి-దీటులేని ప్రభుడటంచు మాటిమాటికిని స్మరించి
॥మంగళ॥

3 దీక్షగలిగి రక్షకుండని వీక్షించి సర్వాపేక్షలెల్లవీడ మేలని-
శిక్షగలిగి మోక్షదాత పక్షమునను నిలువ మనకు- అక్ష
యమగా సుఖమొసంగు పక్షపాత రహితుడనుచు ॥మంగళ

4 వింతవింత లేమిలేకను ఆనందమయుడై - అంతరాత్మగాను
నిలచేను-పంతములకు తావులేని శాంతిగలిగి స్వాంతమానను-
భ్రాంతిరహితమైన దేవు చెంత జేరి చింతవీడి ॥మంగళ॥

5 యెల్లలోకములకు తానైయె విశ్వాత్ముడనుచు యుల్లము
లలోనుండు దేవుడై-చల్లనైనకృపనుగోరు యెల్లమానవు
లను బ్రోవ-తల్లిదండ్రి దాతయనుచు ధర్మములను దెలుపు
ననుచు ॥మంగళ॥

6 ధరను కుందురువారెవ్వరైనను భక్తులను బ్రోచు దరిచూ
పుడై దైవమానన- చెనుకగలిగి వేదవేద్యు స్మరణజేయు
మేలటంచు-మరువులేక ఖాశీందాసు శరణుజేయు శాశ్వతు
నకు ॥మంగళహారతులివ్వరె॥

8. మంగళహారతి.

(శంకరాభరణము - మిశ్రగతి)

1 శ్రీకరముగ వెల్గు చిన్మయరూపును ప్రాపాకమైయుండు
బ్రహ్మమునకూ-రాకాపోకలుచూడా యేకమైయుండు -
నిరాకారమూర్తియా లోకాధారుధ్యానకు ॥మంగళ॥

2 అరమరలేపట్టి ఆర్యవరులకు నెల్ల స్థిరమైన పదవనుచు తేట
పరచీ - భరియించిసర్వము భ్రమరూపమూను మాన్పి-
గురుతేమియులేని గురువర్యునకునూ ॥మం గ॥
3 మండలంబుల నెల్ల దండీగధరియించి అండజేరువారి నాద
రించి - ఖండాముగాకనూ ఖండరూపము నాపై నిండు
చంద్రుని వలెనుండు మహాసీయునకునూ ॥మంగళము॥
4 మోదములరగతాను పాదుదెల్పియు పట్టి గాధాల నెల్లాను
కడకుద్రోచి- వేదాంత వేద్యుడై సాధుజనులకు నెల్లా బోధ
పరచిన దరియా పుణ్యమూ రికిని ॥మంగ॥
5 దాసాదాసుడైన ఖాశీమునుబ్రోచె యీశూడనైన విధం
దెల్పి-మోసమేమియులేనభ్యాసము చేయించి గాసిదీర్చ
నట్టి కరుణాకరుణాకూ ॥మంగళము॥

## పూజపాట.

(కాంభోజిరాగం-ఆటతాళం)

1 పూజసేయురె సద్గురుదేవు పూజసేయురె ॥పూజ॥
పూజసేయురె మంచిపుణ్యాత్ములై మీరు - రాజితమహా
మహారాజరాజౌ గురుని ॥పూజ॥
2 ముర్వ్యోటిజలకము చె ముందుజలకము వార్చి - వెయ్యి
రేకుల మధ్యవెలయు సర్వాత్మునకు ॥పూజసేయురె॥
3 సత్వమనియెడు మంచిచలువ వస్త్రములు - మహాత్మున
కర్పించి మరియాదతో గురుని ॥పూజ॥
4 సందియములులేని గంధంబు నిటుదెచ్చి - అందంబుగను
మేన నలది నిశ్చితు లవుచు ॥పూజ॥

5 శాంతమాదిగ మంచిసద్గుణంబులు పుష్ప - బంతులుగను
గూర్చి పరమాత్మపై నుంచి ॥పూజ॥
6 కామాది శత్రుల కదలకుండగబట్టి - నీమముతోడను
ధూమమొనర్చియు ॥పూజ॥
7 న్యూనంబులేని సుజ్ఞానంబనియెడుజ్యోతి - పూని వెల్గించిన
పూజ్యుడౌ దేశికుని ॥పూజ॥
8 అహమని స్ఫురియించు యజ్ఞానమును దెచ్చి - మహా
నైవేద్యముజేసి మర్యాదతో గురుని ॥పూజ॥
9 కుడీయెడమలబట్టి కుంభకంబుననిల్పి - తడబడకను నిదియె
విడియంబనుచు నిచ్చి ॥పూజ॥
10 నేర్పరితనమైన కర్పూరమును గురుని - కర్పణమనియును
హారతిగను నిల్పి ॥పూజ॥
11 అరలేక దరియూగురు చరణాబ్జముల కొరగి - మరువకను
ఖాళీంమదినిల్పి మహానీయ ॥పూజ॥

2 పూజపాట.

(దన్యాశిరాగం-ఆటతాళం)

1 పూజింతు గురురాయ పుణ్యస్వరూప - శ్రీ రాజాధిరాజ
మహారాజమహనీయ ॥పూజింతు॥
2 వాసనత్రయములుదీసి గంధముజేసి - దేశికప్రియ నీ
దేహముపైనలది ॥పూజింతు॥
3 సుగుణములన్నిటి సుమమాలగాగూర్చి - సగుణుడవు నీకు
హారముగాను ॥పూజింతు॥
4 తాపత్రయములను రగులక న్రేపొద్దు - నీపాదములకును
ధూపముగను వేసి ॥పూజింతు॥

5 మనసేంద్రియములను మరలించి నినుజూడ - ఘనమైన
జ్ఞానమును దీపముగ బెట్టి ॥పూజింతు॥
6 నేను నేనను దోచ హానిగలిగించేడు - మేనిగుణములు
మాని నైవేద్యమిడి ॥పూజింతు॥
7 దరియాగురువరు దేవు కరుణవశీసినయట్టి - పరిపూర్ణులను
గలసి భక్తగ్రంధులతోడ ॥పూజింతు॥
8 ఖాశీందాసుని వేసటలనుదీర్చి పోషించి దయనేలు -
యీశుడె గురుడనుచు ॥పూజింతు॥

## 1. జోలపాట

(లాలిపాటమాదిరి-మిశ్రగతి)

1 జోజోజో గురురాయ జోజోజో మహనీయ - జోజోజో
సుఖరాయ జోజోజో సదయా ॥జో॥
2 నీవారశోకమునవిలచి వర్తింపభావంబునబుధులు ప్రస్తుతి
యొనర్ప - కేవలుడవై భువిని కీర్తిని వహింప - నీవేగా
భవములను నిమిషమున ద్రుంప ॥జో॥
3 దిశలెల్లనిండియును దివ్యులకుద్రోచి - వశమైలివని నిన్ను
వర్ణింప నెంచి విసుగుజెందని భక్తవితతినిటు గాంచి - రశిషు
లను జేయుదు విరాగముననుంచి ॥జో॥
4 సాధనంబులు నాల్గు స్తంభములుగాను - వేదాచతుష్టయ
మను త్రాళ్ళతోను- మోదమలర గురునిబోధ తొట్టిగను
సాధనంబునగూర్చి సఖులు లందరును ॥జో॥
5 పరమాత్మరూపమై ప్రభలు నినునిలపి- స్థిరముగానుంచె
దరు దీనతినుబాపి - తెరవులన్ని యుబ్రోవు విధములను
జూపి - కరుణించి దవుసీలో ఘనముగాగలపి ॥జో॥

6 క్షితిని దరియాగురుడై శివరూపుడనుచు- సతతమును మది
లోను సాక్షిగాగనుచు-వెతలన్నియుబాయుటకు విధమి దే
యనుచు-వ్రతముగను ఖాశీం హితవుగా దలచు ॥జో॥

1 మేలుకొలుపు.

(భూపాళరాగం-ఆదితాళం)

1 సాక్షివై జగముల వీక్షింపుచు బుధులరక్షించ గురుదేవా
మేలుకో॥
2 పక్షపాతములేని ప్రభుడవు నీవనుచు దీక్షగలిగున్నారు॥ మే
3 నిండుసమాధిలో పండియున్నా నీవు పండితులను బ్రోవ ॥ మే
4 యండజేరినవారి ఆదరించెదుకొరకు దండిదైవమునీవే ॥ మే
5 మేరుశైలముపైని ధీరుడవై నీవు వేరులేకున్నావు మేలుకో॥
6 కారాణపతి వనుచు కాంక్షించి భక్తులు కాచియున్నా
రయ్యా ॥ మేలుకో॥
7 లోకలోకములేమిగాకను నీవెవైయై యేకమైయున్నావు ॥ మే
8 సాకెవవని జనులాకొని నీకృపకు చేకొనియున్నారు ॥ మే
9 జగములసృష్టించి జగతిభావముగాక మిగిలినీవున్నావు ॥ మే
10 దిశలెల్లదిగనాడి విగతకల్మషులెల్ల సుగతి గననున్నారు॥ మే
11 వాసిగదరియా గురువరుడవై నీవిట్లుభాసిల్లుచున్నావు ॥ మే
12 ఆసించి తంగెళ్ళదాసు నీసేవాకుదోసిలొగ్గున్నాడు ॥ మే॥

2. మేలుకొలుపు.

(భూపాళరాగం-మిశ్రగతి)

1 సత్యమనుచు సర్వేశ్వరుని జేయుచు సాదుబృందము - నిత్య
ముక్తిని గోరుచును భువినిలచియున్నారు గురుపతి ॥ మే॥

2 ఆపదిఁ [illegible]డనుచు [illegible] త్రములెల్లనిన్న - తేవ
తేవక [illegible]చూను నీదాపునను న్నారు గురుపతీ ॥ మే
3 భిన్నమేమియుగాక నీవె అన్నిరూపములైతి వనుచు
ఆపన్నులై నీపాదసేవను కాయకున్నారు గురుపతీ ॥ మే
4 మేరుశిఖరమందు నిలచినధీరుడవు నీవనుచు భక్తులు -
వేరుసేయక నీదుకృపకై వేచియున్నారు గురుపతీ ॥ మే॥
5 తలపులుండిగేచోటనీవె దాగియున్నా వనుచు దెలిసియు-
మెళుకువతో బుధులెల్ల నినుగని మెలగుచున్నారు గురు
పతీ ॥ మేలుకో॥
6 సదయహృదయ నివాసనీదగు సదనమున సర్వంబుగలదీ-
వదలకను నిన్నాశ్రయించిన కదలకున్నావు గురుపతీ ॥ మే॥
7 యెల్ల లోకములనుభవించె వేదవేద్యుడ వనుచునిన్నే-
యుల్లమున యూహించి విషయము లొల్లకున్నావు
గురుపతీ ॥ మేలుకో॥
8 వాసిగను దరియాహుశ్శేన్ షా దేశికుడనని దీక్ష జేయుచు-
ఖాశీమయ్యయె నీవటంచును కాచియున్నాడు గురుపతీ ॥ మే॥

—:గద్య:—

ఇది శ్రీ దరియాహుశ్శేన్ షా ఖాదరి దేశిక సుజ్ఞానసుత
శ్రీ ఖాశింవలీ షా ఖాదరి దేశిక ప్రణీతంబైన
పరమామృతంబను గ్రంథము సమాప్తము:
ఓం శాంతిః శాంతిః శాంతిః.

---